# జలదాంగన

దువ్వూరు రామరెడ్డిచే
రచియింపఁబడి ప్రకటితమైనది.



వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

చెన్నపురి
ఇండియా ప్రింటింగ్ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రచురింపఁబడియెను.

1920

 [వెల 0-6-0

# కృతజ్ఞత

మాకాప్తబాంధవులును, ఔదార్యవంతులును, కులాభిమానులును, కీర్తికాములును, కవితారసజ్ఞులును, నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా గుండాలమ్మపాళెం గ్రామవాసులును అగు శ్రీయుత తిరుమూరు వరదారెడ్డిగారిచే ఈ కావ్యము ప్రేమలాంఛనముగ ముద్రింపింపఁ బడినది.

# ప్రణయాంజలి

---

ఉ. ఎవ్వతెయందు నామదిలయించి తదన్యము చింతసేయదో
యెవ్వతె ప్రేమపుష్పముసహింపగరానివియోగగంధముల్
నివ్వటిలంగఁ జేసెడినొ, నిద్దురలందు సులభ్యమైన యా
జవ్వని మన్మనఃప్రణయసాక్షిగ మంగళ మొందుగావుతన్

ఉ. అల్లియుఁ బూలుపూవని లతావళులట్టుల నాదుకోరికల్
కొల్లగ రేఁగియుంగుడుపుగూడకపోయె; మదీయపాపముల్
వెల్లువలౌచు నిద్దఱను వేఱొనరింపగ, దైవదూషణం
బొల్లను; పూర్వజన్మఫలితోత్థితముల్గదమోదఖేదముల్; 2

మ. బయలంబ్రాకని రింపకోతలకు నాభావంబుశుష్కించిలో
సయిపన్రాని విషాదకశ్మలమునన్ సంతోషలోకంబెయుం
ధ యుతంబై కళదప్ప, యౌవనపుటుత్సాహంబుజీర్ణింపస్వ
ప్నయథార్థంబును లౌకికంబనెడి యోగ్యవంబోఁచుచింతిం
చుదున్; 3

తే. గీ. నిమిషమైన రహస్యంబు నిలుపలేని
యద్దపుం బెట్టెలే మనయాత్మలైన,
బట్టబయలుగ నిరువురి భావవృత్తి
లెఱుకపడునేమొ కన్నియా! యింపుగలుగ; 4

తే. గీ. కామదగ్ధంబునై, శాంతిగాంచి యున్న
భావభూతిని నిర్మల ప్రణయలతిక
లల్లుకొని పూలుపూచె; నాయార్ద్రగంధ
మిరువుర మనుభవింపలేమె సుమాంగి; 5

తే. గీ. పండిపండనికోరికపంట భూమిఁ
బారలి ప్రవహించు విరహానిర్ఝరిణితటులఁ
బ్రణయ బంధంబువిచ్చి, పరస్పరాను
చింతలకు జలాంజలి యీయ సిద్ధపడెదొ; 6

తే. గీ. అట్లుగాక, వెన్నెలగాయునట్టిరేల
వలపుమధువాని చిత్తంబు భ్రమయుచుండఁ
జుక్కపువ్వులపందిరి సొగయుఁ జేత
పట్టెదో మోహనానిలవ్యజనమబల! 7

మ. తలిదండ్రుల్ మనకోరికల్సమయుయత్నంబింతగావించియుం
గలలంగల్గు మనోహరప్రణయ సఖ్యంబుందొలంగించిరే ?
చెలియా, యిద్దఱి ప్రేమబంధనము విచ్ఛిన్నంబుగాకున్నఁ
గాంతులు దుస్సాధ్యములయ్యెఁ గొంతదనుకన్సంతోషమే
గూర్చెడిన్. 8

తే. గీ. ఇంక నీలోకమున మనకిద్దఱకును
హృదయరక్తికి నాలంబ మొదవకున్నఁ
బ్రణయమెల్ల ఫలించు స్వర్గమ్మునందు
ననుభవింత మానంద రసామృతంబు; 9

మ. కనులం గాటుకఁజీఁకటుల్ నెఱయఁ, గ్రీగంటన్విలోకించినా
మనము న్మానఁగరాని గాయముల నొంపఁ, స్వప్నమల్లెలచ
క్కనిదానా! పొడకట్టెదీవు; ననునింకం జిమ్మచీకట్ల వీ
ణనువాయించి వియోగగీతి లయమొందం బాడనిమ్మోం
టిగఁ; 10

ఇట్లు,

విరహాపరిచితుఁడు.

# జలదాంగన



తే. గీ. నింగివ్రనీగూరఁ బండి రాశించుచున్న
పైరుపొలముల విహరించు పంటలక్ష్మి
యొఱపుఁబయ్యెద బంగారు మెఱపులనెడు
సంజనిగ్గుల వరిమళ్లు చాయ లొలికె !

చ. పొలముల కాలమేఁపుటకుఁ బ్రొద్దున నేఁగిన కాఁపుబిడ్డ లా
వుల. పదధూళిసోక నెడ వ్రాయెడు దూడ లదల్చికొంచు, నిం
పులు చిలికించు వేణురవము ల్పలికించుచు, గూళ్లఁ జేరు ప
క్షులకునుమున్నె యూరి దెసకు న్మరలించిరి యాలమందలన్

తే. గీ. గగనసీమంతినీ కంఠ గళితమైన
మల్లె పూదండ రేఁకులు దుల్లెననఁగఁ
బైనఁ జరియించు కొంగల బారు లెంతొ
యలరుచుండెను దర్శనీయంబులగుచు 4

తే. గీ. ప్రకృతియెల్లను శాంతమై పరగుచుండ
శాలి కేదారములలోనఁ జల్లగాలి
నల్ల నల్లన విహరించు చుల్లమందు
నంతులేని యానందంబు నందుచుంటి

చ. కనుఁగొనుచుండఁగా జలదకాంతల కుచ్చెలకోక చెంగులం
దనరు జపాసుమార్ద్రరుచి దగ్గను ; దిక్కుల నుప్పతిల్లె నం
తనెయిరు; లక్కడక్కడను దారకలుంగనుపట్టె; మిక్కమం
చనయము మిణ్గురుంబురువు లాడుచునుండెను జేలగట్టులన్

తే. గీ. గగన రత్నాకరంబు నాగ్రహామునొంది
కాలను నెను నగస్త్యర్షి, కమలబాంధ
వాంశుసిరమ్ము గ్రోలిన నసటఁ దోఁచు
రత్నములనంగ నక్షత్రరాజి మెఱయు 7

ఉ. అంత సుధాంశుబింబము వియత్తలమం దుదయించె, నారతీ
కాంతుఁడు యామినీరమను గాంచుటకుంజను వేళ మల్లెపూ
బంతి శితాంగముం జదలబాటఁ జకోరపువారు వాలచే
వింతగఁబూంచెనా మొయిలుపిండిహిమంబుగ రేఁగునట్లుగన్

సీ. గగన స్రవంతికా కల్లోలడిండిర
ఖండంబు లభ్రమ్ము గప్పెననఁగ
నందన కల్పద్రుసందోహములు పూచి
మెల్లెడఁ బుప్పొడి చల్లెననఁగ
ప్రాగద్రి శిఖర ఘర్షణమునం దొలివడి
యుడుభర్త యమృతంబు నొలికెననఁగ
దిజత్త్ర కందంత దీప్తు లాకాశ ద
ర్పణమున బింబించి వఱలెననఁగ

తే. గీ. శర్వరీ మందిరాంతర స్తంభులైన
హీరమణి దీపముల కాంతి సారమనఁగ
మెత్తఁదనమును శైత్యమ్ము మిళితమైన
పండువెన్నెల నల్గడ నిండుకొనియె! 9

ఉ. వెన్నెలఁ జూడ నందమగు వేసముదాల్చిన కొండనెత్తమం
దున్న పయోదమొండు పవనోద్ధతి కల్లనఁదూఁగి యాడుచున్
సన్నని యంబరంబటులఁ జందురుగప్పుచు పీఁగిపోవు చె
న్నెన్నొ మనోహరాకృతుల నెత్తుచుఁ గన్నులఁగట్టెవింతగన్

ఉ. చూడనుజూడ నందమగు సుందరి రూపుధరించి, వేణి రా
పాడు జరీముసుంగు హరిణాంకు కళిన్నసలాడఁ గాంతునిం
గూడి నభోవిహారవనకుంజతలంబుల సంచరించు పె
న్వేడుక రోహిణీ రమణి వేయరుదెంచెనపంగఁదోఁచినన్; 11

తే. గీ. జలదకాంతను గాంచి యాశ్చర్యమొంది
కన్నువాల్పక సందమ్ము గనుచునుండఁ
గవికుమారుఁడ నౌటఁ దక్షణమె నేను
భావమున నబ్ద సాహాయ్యపదవిఁబొంది 12

చ. చెలియ ! యభీష్టరూపములఁ జిత్రగతింజరియించె దీవు; నీ
చెలువముగాంచ మ్రోడయినచిత్తముగూడఁజిగిర్చు; నేలకో
వలిపపుమేల్ముసుంగునిడి వచ్చితివొంటిగ, వాసమొద్ది, యెం
దులవిహరింపఁబోయెదవు, తుందుచుకొందకనిల్చి తెల్పుమా!

తే. గీ. నిన్నుఁగనుఁగొన్నదాదిగ నీదుచరిత
తెలిసి కొనఁ గౌతుకంబు చిప్పిలెడి నబల !
యెవరిదానవు? తలిదండ్రు లెవరో గాని
ఘనుల సంతతిగా నీవుగానఁ బడెదు! 14

చ. అనవిని కాంత యిట్లనియెనంత, మదీయచరిత్రమంతయున్
వినుచువిషాదమోదముల విచ్చినచిత్తముతోడ దైవసృ
ష్టిని దలపోసి యబ్బురముఁజెంద నభీప్సితమేని నాకథన్
వినుముకవీశ్వరా! ప్రణయవిహ్వలతన్నెయిసౌఖ్యసంతతుల్

తే. గీ. నీవెఱుంగని వింతలు, నీమనంబు
పొచ్చ శక్యంబుగాని దెచ్చోటగలదు ?
ఐన నానోటఁ జెప్పింప నాసయేని
వినుము పుట్టుపూర్వోత్తరంబును కవీశ ! 16

చ. జలజభవుండు, సూర్యుఁడు నిశాకరుఁ డుర్వియు,దారకల్దిశల్
కులగిరు, లవ్వియివ్వియునుకోఁ బనియేల? సమస్తవిశ్వమున్
సలుపకమున్న నాదుసరసంబగు పూర్వపు రూపొనర్చె న
న్న లవము నాత్మసంస్తుతి యనంజనరెమ్మెయిఁదత్వదర్శనుల్

ఉ. జంట నిసుంగులట్లు, నను సంతమసమ్మును గాంచి మాయవా
ల్గంటి యదృశ్యగాఁగఁ గడగండ్లనుసైపుచుఁ దల్లిలేని మా
చంటి తనమ్ముపుచ్చ, నిమిషమ్మును నీడనిమస్సుఁబాప మా
యింటను గాస్తిగోశములు హెచ్చెను లెక్కకుమిక్కుటం
బుగన్ ; 18

చ. అనుజనుగోలుపోయి మదియం దెడవ్రాని వియోగవేదనన్
వనరుచునుండఁ బృథ్వియను బాలయొకర్తుక చేరవచ్చి న
న్ననునయ వాక్యముల్పలికి, యార్తియొకింత శమింపఁ జేసినా
మనమున కెక్కుదాస్యమున మాగృహమందె వసించి యుం
డినన్; 19

తే. గీ. కాలుఁ డనియెడు సుందరాకారుఁడొకఁడు
మమ్ము నిరువుర నీక్షించి మానసంబు
ప్రణయముగ్ధంబుగా వచ్చి, వలపుదెలిపి
పరిణయంబాడె సౌఖ్యసంపదలు పొదల 20

ఉ. కొన్నిదినాలు ముప్వురము, గోరికలీరికలెత్త సౌఖ్య సం
పన్నతఁగాపురంబుసలుపన్ ఫలియించెను నాదుగర్భ; మా
పన్నతనొంది పృథ్వి మదిఁ బాటిలు నీసున నాసుఖంబు సై
పన్నరింతలేక చలపట్టి గృహంబునఁ బోరుపెట్టుచున్;21

తే. గీ. ఆక్రమించెను నావాసమందుఁ గొంత
స్థలము 'నదియేమొ' యన్న 'నీసవతిగా నె
హక్కు లేదఁటె నాకింట' ననియెఁ బృథివి
చేరఁదీసిన ఫలితంబు సిద్ధమయ్యె! 22

క. ఇది పతిచనవని గనుఁగొని
తుదకేమియుఁ జేయలేక దుఃఖముపాలై
కుదురెఱుఁగక తొందరపడ
నొదవెను నీఫలమటంచు నూరకయుంటిన్ 23

క. అంతటఁ గొన్నేండ్లకు నా
కాంతకు సంతానవృద్ధి గలిగెను; నైనం
బంతంబు విడదు నాపయి
నంతింతకులేని తగవులాడుచు నుండున్ 24

తే. గీ. సవతులకు గిల్లు జగడాలు సహజమైన
బిడ్డలైనను నొండొరు ప్రీతిమెయిని
నొలపు పొరపొచ్చములు లేక యుందురన్న
నదియు నొనగూడదాయె సీర్ష్యాళులగుట 25

చ. అసురులకు న్నిలింపులకు నయ్యెడు తియ్యని పోరులట్ల వె
క్కసముగ మాయపత్యములు కయ్యములాడుచునుండఁ బృథ్వి
యుం గసిగొని మందెమేలమునఁ గాంతుని చిత్తము మ్రుచ్చిలించి
యుల పెసఁగెడు బుద్ధి నాత్మజులకీ నొసరించె రహాస్యరీతిగన్

తే. గీ. పైతృకంబగు "బుద్ధి" సంపదను బడసి
విఱ్ఱవీగుచు మమ్ముల వెతలుగుడుప
నెన్నొ సాధనములఁ బన్ని యెట్టయెడకు
నాదు సంతతిఁ బట్టి తినంగ నైరి 27

శా. అంతంబోక మదీయగర్భమున గోప్యంబౌనటుల్ చేర్చి నే
నెంతో మక్కువ దాచియున్న మణులున్ హీరంబులున్ ము
త్యముల్ కాంతింజిల్కు ప్రవాళవల్లులు బలాత్కారంబు
గా నాచికో। శాంతింజెందునె నామనంబెటులనో సైరించు
కోఁ బోయినన్? 28

చ. తనరె బలంబటంచు నిదిధర్మమధర్మ మనాక కార్యముల్
పొనరుచు పృథ్వీసంతతుల పోతరముంగని, యింతగర్వముం
డినఁగొనసాఁగునే కడకు డెప్పర మౌనని యెంచికొందు; నం
తనెశివమేల? యెప్పుడయినం దుదిదాక నె దుష్టకల్పనల్; 29

చ. తనకు బలంబు శౌర్యమును ధైర్యము నిచ్చి సమస్త సౌఖ్యముల్
క్రమముగఁ గూర్చి వైరినికరంబు పదానతమౌ సమీకమా
ర్గము గనిపించు బుద్ధి ముదరన్విషమించి నిజాశ్రయంబుగా
ల్ప మొదలు వెట్టుఁ; బరిపాటికి మించిన నిర్ఘృణా గదా! 30

తే. గీ. ప్రకృతిశాస్త్రంబు విద్యయు భవ్యకళలు
భావసంపూర్ణతకుఁ దోడుపడుటలేక
ప్రజల నాశనమునె పర్యాప్తమగుట
నెలవుకన్నెకు డగ్గించు వలనఁగాదె! 31

ఉ. నావలు చేసి, నాహ్వదము నాళములెల్లను ఝంఝరానిలుల్
త్రోవలు దీసి, యాత్రకడఁ ద్రోసి, శరీరసుఖంబెసోఁగి యీ
ర్ష్యావిలచిత్తులై తుదకు నందఱు భోగముకారణంబుగం
గావలమెత్తి పోరిరి యనావికలై తమతల్లి బెగ్గిలన్ 32

తే. గీ. గారవించిన నాగరికంబుకతన
ధూమఫూత్కారములలోనఁ దూలిపోయె
మనుజసంతాన మాహవవత్సరమునఁ
గంతదశనా వినోదంబు గడపు నహహా! 33

తే. గీ. నన్నుఁ బెట్టిన కష్టంబులన్ని సవతి
పొందుచున్నది పుత్త్రుల మూలమునను
కన్నబిడ్డల నెత్తురు కాల్వలందు
నీఁదుచున్నది పృథ్వి సహించి యెటులో ! 34

తే. గీ. కోరుచుండిన తరుణంబు గూడికొంట
సవతి పుత్త్రుల రక్తంబు చవులుపుట్టఁ
దనివి దీఱఁగ నేను సంతానములును
ద్రావినారము సురపూరంబు. లటుల ! 35

మ. ప్రతిహింసాపరమైన నామనమున్ సైపన్ లేక నీకేను జె
ప్పితిగాని యిటు వంటిగాథ; ప్రణయావేశమ్మునన్ విన్నవిం
చితి నంచీవు దలంపఁబోకు సుకవీ ! చిత్తంబమర్షైక వం
చితమైనప్పుడు నన్నుబోఁటికి శమమున్సేవింప సాధ్యంబొకో

ఉ. మాటకుమాటవచ్చి చనుమానసముతో నిటులంటిగాని, నా
కేటికి మున్నమున్న శమియించిన గాథలు ద్రవ్వఁగోఁగ; నా
పాటికి నంతరాళమునఁ బర్యటనం బొనరించి పిన్నబి
డ్డాటలనాడికొందుఁ బవనార్భకుఁడర్మిలినన్ను గూడఁగన్; 36

క. అనవిని పల్కితి, జలదాం
గన యిట్టిసురూపమెటుల ఘటితంబయ్యెన్
మునుపున్న వనధిరూపం
బును నెట్టుల మార్చితివి యపూర్వపురీతిన్ 37

చ. తెలుపుమటన్న, నౌనవును, దెల్పుటకు న్విషయాంతరంబు
వర్తిలుటయు, నెట్టులో మఱచితిఁ, వినిపింతును శేష; మిద్ధరన్
గలుములు లేము లెప్పుడు వికారము లొందక యేకరీతి ని
శ్చలముగ నుండఁబోవనెడు సామెత నీకెఱుఁగంగరానిదే ?

తే. గీ. కొన్ని దినములు చీఁకటి కొన్ని నాళ్లు
వెన్నెలనియెడు లోకోక్తి విదితమయ్యె ;
నాకు మనసీక వర్తించు నాహృదీశుఁ
డెలమి వశవర్తియయి నన్నె వలచియుండు 39

మ. ఒకనాఁడిద్దఱ మిష్టగోష్ఠిఁ బ్రణయంబుప్పొంగి లోకంబుదో
పకసౌఖ్యంబులఁదేలియాడికడకున్ భావంబు శాంతింప, నా
యకలంకంబగు పారవశ్యమును నెయ్యం బారవర్ణించి మా
మక సౌందర్యరసాబ్ధి నీఁదుచు వచోమాధుర్య మేపారఁగన్.

ఉ. కాంతుఁడు, ముద్దుచెక్కిళులు కమ్మనినవ్వుముసుంగులోన నం
తింతనరాని నౌరురచియింపఁగ నింపగురీతిఁ బల్కె నో
కాంత! క్షమింపు మున్ను నిను గన్నులఁ గప్పికొనంగలేకయ
త్యంతముపేక్షతో మనముదాఁచిన నావిరసంపుఁజైదముల్!

తే. గీ. వెడలె గ్రహచార వేళయుఁ, బృధివియన్న
నీవ యన్నను వేఱేమి నీరజాక్షి !
మునుపు సలిపిన యపరాధములను మఱచి
నన్ను నీదాసునిగ నేలు మన్న వినవె? 42

చ. కలదు రహస్యమొండు; కినుక న్వహింపకు మోసమంచు నే
దెలుపక యూరకుంటి పౌలఁతీ! గతమెప్పటికిన్ గతంబె; యం
దులకు విచారమేల? ననుదుష్టుఁడ నంచని గాలఁదన్ని నం
జెలిమి నెఱింగి దగ్గఱకుఁ జేర్చిన నియ్యవె పాపపుణ్యముల్

చ. అని మగవారికిం దెలుప నక్కజమించెను నెన్నొ తియ్యముల్
మనము గరంగఁ బల్కి నను మన్ననవేఁడి, యనంతరంబు జం
కును గపటప్రచారమునకు న్వెడనవ్వను సిగ్గుదోఁప ని
ట్లనియెఁ గపోలమంజిమములల్లన హెచ్చుచుఁ దగ్గుచుండఁగన్ 44

మ. వనితా! యేమని చెప్పవాఁడ, ప్రణయవ్యామోహచిత్తుండనై
నిను గాలుండను పేరఁ జేరితిని, నే నీరేజబంధుండఁ; బ
చ్చని గుఱ్ఱంబుల తేరిపై గగనసంచారంబు గావించుచుం
దును; నాహూపమెఱుంగఁగోరికయినం దోడ్తోన వీక్షింపుమీ

చ. అనివచియించి, కాంచనకేతాంగము హీరకిరీటమొప్ప మో
హాననవకాంతులీనెడు సహస్రకరంబులతోడ వెల్గుచున్
గనులకు వెక్కసంబగుచుఁ గానఁబడం, దలయెత్తిచూడలే
క నిలిచియుంటిని వికారము నొందని ఱాతిబొమ్మగన్ 46

ఉ. అంత నిజస్వరూపము దయామయుఁడై కుదియించి, సూర్యుఁడుం
గాంత! ప్రభాతకాలమునఁ గాంచనచేలము దాల్చి నాయనం
బెంతయు ముచ్చిలించితివి, యింక నినున్విడనాడఁజాల, నా
చెంతనె సర్వసౌఖ్యములు చేకుఱఁగాఁ బురముండుమీ యనన్.

మ. కలలోఁదోఁచెడు వింతమార్పులఁటులంగాలంబునందోఁచె, నీ
జలజాతాప్తుని బ్రత్యహంబు గనుదుఁ సంతోషమేపార, నీ
చెలువంబుం గమనీయమూర్తియును నేసేవింపలేదింత, కొ
చ్చెల! నాభాగ్యము పండెగా వలయునీచిత్రంబుసంధిల్లుటఁ.

తే. గీ. ఒక్క నిమిషంబులోన నాయుల్లమపుడు
పూలతేకుఁల తెక్కలఁబూని యెగిరె
స్వర్గపవనంబు వీచునావరణమునకు,
నారి! రూపాంతరం బెత్తినట్టు లయ్యె. 49

తే. గీ. అభ్రసంచారిణీ మోహనాకృఁడేడ ?
క్రింద ఘోషించు నేనేడ? క్రీడయేడ?
అందరాని ఫలంబుల కాసచేయు
నట్లు ప్రణయపర్యవసాన మానొ యేమొ? 50

చ. అనితలపోసికొంత, ప్రణయంబుముదంబువిషాదముఁ మనం
బునఁ బెనఁగొన్నలోనఁదగఁబుచ్చిహృదీశునిగాంచికాంత యి
ట్లనియె మనోహరా! గగనమందుఁ జరించెడిమీకు, నాకు నె
ట్లనువగుఁ గాఁపురంబు, మునుపట్టు లెపుత్తము భావికాలముఁ

తే. గీ. అయిన ననుకొందు, మీదుపాదాంబుజముల
రజములకు నైన సరిపోఁదరంబె నాకు?
అట్టి నన్నును వలచి రూపాంతరంబుఁ
బూనుటెంతయు నాపూర్వ పుణ్యమేమొ! 52

క. అనవిని సూర్యుఁడిట్లనె
మనమున నెల్లంతొ నీవుమానిని, నీ రూ
పును గాంచ దివ్యసుందర
తనువటు గన్పట్టు నాకుఁ, దథ్యంబిదియున్. 53

ఉ. శీకరమౌక్తికంబుల రచించిన కంకణపాళి మ్రోవ వీ
చీకరముల్ మనోహరపుఁ జిట్టకముల్ పచరింపఁ జూపి సం
ధ్యాకమనీయవేళల ముదంబున నంగవుఁగింటఁ జేర్చు నీ
సాకతము న్మదిందలఁప స్వర్గసుఖమ్ము నధఃకరింపదే? 54

తే. గీ. అభ్ర సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తఁ
జేసెదను రమ్ము నాతోడఁ జెలువమిన్న!
లోక మెల్లను నీయాజ్ఞ లోఁగియుండ
నేలెదవుగాక సస్యవిశాలధాత్రి! 55

చ. అని కరముల్ సహస్రమునునల్లనఁజాపి ప్రమోదబాష్పబిం
దు నికరముల్ దొరంగ నవతోయజమిత్రుఁడు కౌఁగిలింప నే
మనివచియింతు బాష్పమయనై యుపగూహనమందె లీనమై
తిని; తదనంతరంబునను దేకువఁ జేర్చె నభోంతరాళమున్ 56

మ. వలిగాలిం దనుతాపముం దొఱఁగి దివ్యంబైన యీరూపము
జ్జ్వలశంపాభరణంబులుం గలుగ నేసంతోషముం బొంది ని
చ్చలు వాతార్భకుతోడ నీతలములన్ సంచారముం జేయుచున్
మలనెత్తంబులఁ దీవటోవరుల లోనం జేరి క్రీడించుదున్ 57

తే. గీ. సాంధ్యవేళల పడమటి చఱులయందుఁ
బొటమరించెడు నపరంజి పొడుపు టేటి
యందు నీరాడి, పెన్నెఱు లార్పుకొనుచు
వచ్చుచుందును గవుల భావంబు లలర! 58

తే. గీ. పండువెన్నెల లలరు శర్వరుల యందు
వలిపపు ముసుంగు నోరగా వలనుపఱచి
వెన్నెల పులుంగు పిల్లల చిన్నినోళ్ల
నమృతరసముఁ బూరింతు నెయ్యంబు గదుర. 59

తే. గీ. ప్రొద్దువొడుపున విరియు క్రొంబువ్వులయందుఁ
గాఁపురంబుండు నిందిర కంఠసీమ
మంచుతుంపర ముత్యాల మాలఁగట్టి
వైచుచుందును నానందవర్ధనముగ 60

తే. గీ. అభ్రగంగా ప్రవాహంబు నవల దాఁటు
గమ్రమణుల సుకేశుండు గట్టినట్టి
యింద్ర ధనువను వంతెన నెక్కిపోదు
జలక మాడిన తెరగంటి చెలులతోడ 61

చ. కనులకునిచ్చక్రొత్తలయి గానఁగవచ్చెడు వింతలెల్ల నే
గనుచు నభోంతరాళమునఁ గాంతునితోడవసించియుంటియం
తన మతికొన్నినాళ్లకు నతర్కితరీతి నెఱుంగనయ్యె నా
యమని పిసాళిమోస మిఁక నెంతయొనర్పఁగ నంగవింపఁడో

ఉ. ప్రొద్దున శయ్యవీడి చెలి పోయెదనంచు వచించి యేఁగుచో
నెద్దియొ సందియంబు [illegible]చ్చు రహస్యపు రీతి వెన్నడిన్
సద్దొనరింపకే నరుగఁ, జల్లగఁ బోయెను నంగమెల్ల, నిం
కెద్ది వచింతుఁబో కలుగనే కలిగెన్ సవతమ్మ నాకునున్!

చ. ననునటునమ్మఁబల్కి గగనంబులకుం గొని తెచ్చె, బూర్వపుం
దనువుదొఁలంగఁ జేసె; మమతన్నను బాయని పిన్నపాపలన్
నెన రొకయింత లేక విడనే విడివచ్చితి; నింతకున్ ఫలం
బనఁగ సరోజినీసతిని నత్రిలిఁ బెండిలియయ్యెఁ గ్రమ్మరన్! 64

చ. అలరులబంతి యంట! తనువందిన కమ్మని మోహమంట! సొం
పొలుకుమిటారియంట! తనయుల్లమునంగలకోర్కెపంటయం
ట! లలితచిత్తమూఁనట గనంగనముద్దులమూటయంట! యీ
పలుకులఁ గాంతుఁడే సవతిఁబల్కిన, నేవినియెట్టులోర్వఁగన్;

చ. కొదమపిసాళి తుమ్మెదల గుంపులు ఝుమ్మని పాటపాడ వా
యుదళితచంచలోర్మికల యుయ్యెలనూఁగుచు జిల్గుమంచుప
య్యెద నరమోముదోఁపఁగ పయి న్మసుగట్టులవైచి పద్మినీ
సుదతి ప్రమోదముం గొలుప, సూర్యుఁడు నావలిపమ్ము
దీయుచున్. 66

చ. అలరులమిన్న, రమ్మని సహస్రకరంబులఁ గౌఁగిలింప నా
జలజలతాంగి యంగమున సన్ననిపుల్కలు నారు వ్రాసిన
ట్లలరఁగ, నింతమోమునిఁకనంతగవిచ్చి యొయారపుం దెఱుం
గులఁ బతిచిత్తమున్ బడయ, గోడడకింపదె నన్ను మిత్రమా!

తే. గీ. కామినికిఁ బ్రాణతుల్యుఁడౌ కాంతుఁ, డెవతో
నొకతె వలపింప ముగ్ధుఁడై యుల్లమిచ్చి
మొదటి కాంత నొప్పరికించి పోవుసతఁడు
గొంతుఁ గోయలేఁడే తడిగుడ్డఁ జుట్టి ? 68

తే. గీ. ఖరకరుండఁట ! లోకంబు గాల్చునంట !
అట్టివానికిఁ జిత్త మింకెట్టు కోమ
లంబుగానుండు ? మోహవిలాసముగ్ధ
నోటఁ గపటంబుఁ దెలిసికోనైతి నకట ! 69

ఉ. నన్నొక భోగకామిని యనం దలపోసి, యభీష్టసిద్ధి యౌ
ట న్నను వీడనాడి కులట న్జలదాంగనఁ గూడెనేమొ! యీ
తెన్ను నెఱుంగకుంటఁ గడతేఱఁగరాని సపత్నిమత్సరం
బెన్నుచు వంతలంగుడుచు చెట్టులో కాలముపుచ్చ నేర్పడెన్.

చ. ఇది యిటులుండఁగానె మఱియింకొకవార్తవినంగనయ్యె, న
య్యది వినఁ బుంటు నుప్పిడినయట్టులు, గాల్చినసూది వీనులం
దదిమినరీతి నయ్యె నవురా! తరుణార్కుని నుండగంబు, దా
నిదివఱ కొక్క ఛాయయను నింతిని పెల్లి యొనర్చెనంటకా!

తే. గీ. అంతకంతకుఁ బతి యకృత్యములు హెచ్చఁ
జల్లవైచిన పాలునా జవికి మానము
విఱుగ, నాత్మహత్యయుఁ గొంత ప్రియమటంచు
నంత హిమగిరి కేఁగఁ బ్రయాణమైతి. 72

ఉ. అంచలబారు మానససరోంబువిహారము గోరిపోవుచో
గాంచి తటస్థమయ్యె విధికల్పన నర్మపుదారితో డటం
చెంచి, యలంత లేక పథమేత్తైఱి సాగ వచించు గాథ లూ
కొంచునె మంచుకొండ యెడకుంజనఁగల్గితి నాసపెంపునన్

మ. అరరే యేమని దెల్పుదాన సుకవీ! యాకొండయందంబు,ని
బ్బరమై మంచొలికించు తెమ్మెరలు వీవన్ దిక్కులివ్వంచుఁజూ
పఱు లెన్నంగ నశక్యమౌట, నచటం బల్లంబులు నిట్టలుం
దరులుంగాల్వలులోయలంచుఁ దెలియన్రాకుండఁజూపట్టెడిన్

తే. గీ. అంబుధరగర్భములు చీల్చి చాకసమున
హిమ ధరాధర శృంగంబు లెదిగి యెదిగి
కన్నులకు నందు మేరల కన్న దాఁటి
తారకామండలంబును దాఁకుచుండు 75

తే. గీ. తరువు లెల్లఁ దుషారంబు దపిలి గడ్డ
గట్ట, నద్దంపుఁదునకల కళలు దేలి
మంచు ముసుఁగులఁ బచ్చ రాణించుచున్న
చివురుటాకు జొంపంబులఁ జెలువుగొలుపు; 76

తే. గీ. శీతగిరి గాంచినంతనే చిత్తమందు
వెలుగుచున్న నమర్ష కీలలు శమించె;
చుట్టుపట్టుల నడయాడి చూతమంచుఁ
దరలితిని మంచుగడ్డ నెత్తమ్ములకును 77

చ. అనవిని నేను బల్కితిని, యంగన నీదగు భాగ్య మేమి సె
ప్పను! గనుఁగొంటివే కనులపండువుగా హిమవద్ధరాధరం
బునఁ గలవింతలన్నియుఁ బ్రమోదము పుట్టెడి నీవుదెల్పఁగా
విని, యిఁకఁజూచినం గలుగు వేడ్కలకుంబొలిమేరలున్న వే?

ఉ. ఏనును నీప్రకారముగ నెక్కడి కైనను నేఁగురూపముం
బూన వలంతినైన హిమభూధరశృంగము లెక్కియాడ మో
దానఁ జివ్రుక్కుమం చెగిరి దాఁటనె యంతటి నోము నోయలే
దో నరులక్కటా! గఱులతో నొకపుల్గుగ నైనఁబుట్టనే? 79

చ. అనవిని యంబుదాంగనయు నౌనవు, నాగిరి యంద మాడకీ
వును జని చూడకున్న ననుబోఁటివచించినయంతమాత్రఁ దీ
ఱునె తమి, పుట్టతేనియలు గ్రోలినవాఁడు రుచిన్వచింపఁ దీ
పును నెఱుఁగందరంబె యొకబొట్టయినం జవిచూడకుండినన్?

సీ. అవుగాని యటుమీఁద, నాకొండ మంచుగ
డ్డలు ప్రీలఁ బగుళుల నొలుకుచున్న
సెలయేళ్లు వెండికమ్ముల లీలఁ జాల్కొన
నటకేఁగి చలినీళ్ల యందు దోఁగి,
బలువైన మంచుతుప్పలు గాలిఁ దూలిన
నొరగా నటునిటు నొసరిలుచుఁ
గన్నులఁగట్టియుం గట్టక మాయమౌ
కల యట్లు నెల్లెడఁ గలయఁదిరిగి

తే. గీ. విష్ణు పాదాబ్జమునఁ బుట్టు విన్నువాక
వెడలు గుహ కడ నొకకొంత వేచిచూచి
శంకరుని యెద్దుగిట్టల జాడఁబట్టి
గదలిపోతిఁ గైలాస శృంగంబు దరికి. 81

సీ. వలకాల మంజీరవలయంబు సొంపిల్లఁ
గుడికాల బిరుదందె గులుకుచుండ
వలకేలఁ గంకణమ్ములు ఘల్లుమని మ్రోయఁ
గుడికేలఁ బాప పెందోడవు లలర
వలరొమ్ముపయ్యెద వలపుగుబ్బలి నిక్కఁ
గుడిరొమ్ము బూది నిగ్గులఁ జెలంగ
వలకొప్పులోఁ దావిచిలుకు గేదఁగి పూవఁ
గుడితల నెలపువ్వు కొమరుసూప

తే. గీ. డక్కచేనూని, మేనులు సొక్కిసోలఁ
బ్రమదగణములు నాడుచుఁ బాడుచుండఁ
బ్రకృతి యాత్మయు మిళితమాపగిదిఁ దాండ
వించు నర్థనారీశ్వరు వేడ్కఁ గంటి! 82

ఉ. అక్కడ నుండి, దేవతల యక్కఱదీర్పగ మన్మథుండు దా
నెక్కటి పూవువిల్లు గొని యిందుకళాధరు నొంపవచ్చినం
గక్కసమెత్తి నెన్నుదుటి కంటిసెకం గరగించినట్టి యా
ప్రక్కకుఁబోయిచూడ నటఁ బట్టదుపచ్చనిపూరియేనియుఁ

తే. గీ. బదరికాశ్రమ వాసులౌ పరమమునుల
యజ్ఞవాటులు నేఁటికి నలరుచుండు;
నెండ కెండి వానకునాని యిప్పటికిని
నమరు నచ్చోట యూపకాండముల గములు ; 84

క. అటనుండి విధి వశమ్మునఁ
దటరుహ వల్లీనికుంజ తతుల మనంబు
త్కటు మోదంబునఁ దేల్చెడు
మటుమాయల కొలను గాంచి మంజులమనుచుజ;

తే. గీ. విమలజలములఁ గ్రుంకిడ వేడ్కగలుగ
మునిగితినో లేదో యంతలోఁ దనువునందుఁ
బలుక శక్యంబుగాని పెంజలియు వణకు
గదిరి యటునిటుఁ గదలు లాఘవము దోలఁగ ; 86

తే. గీ. అక్కటా ! మోసమంచు శోకార్త నగుచు
దిక్కుదెస లేని దానవై సొక్కుచుండి
ప్రాణమేఁగిన మెయి కట్టెవాఱు నటుల
మంచుతాయిగ నంతలో మాఱిపోతి ! 87

ఉ. అప్పటినాయుదంత మిసుమైన నెఱుంగను ; లేచిచూచుకొ
న్నప్పుడు లేఁతనవ్వ లొలయఁ జలజాప్తుఁడు జేరవచ్చిన
న్నొప్పరికించినట్టి కొల యూరడగం బరిచర్య సల్పి నం
దప్పుతమించమంచడుగఁదగ్గఱ నిల్చియెయుండె దీనుఁడై;

ఉ. ఆతని నవ్వు గాంచి హృదయంబునఁ బట్టగరాని రోషమ
త్యాతతరీతి గుబ్బటిల నాస్యముఁ జూడగనైన రోసి నా
నూతనమైనరూపము గనుంగొని నిర్ఝరగర్భమందు సం
ప్రీతిగలీనమైతి ; నిది మేలెయగుంగద నన్నుబోఁటికిన్ ; 89

తే. గీ. పగ దలంపక, నాకష్టపాటు గాంచి
సవతి యైనను పృథ్వి నాసరస జేరి
యార్తి యొకకొంత శమియింప ననునయించి
నన్ను దనయింట నిలిపెను గొన్ని నాళ్లు ! 90

ఉ. అచ్చటఁ బచ్చతామొలక లట్టులనింపగు పైరుచేలయం
దిచ్చకు వచ్చినట్లు చరియించి యనంతర మూటకాల్వలం
జొచ్చి, కొలంకులంగలువజోటులు పుప్పొడికాన్కలీయగన్
హెచ్చినసంతసంబున గ్రహించి నిజాలయ మేఁగుకోరికన్ ;

తే. గీ. బలిసి, కూలంకషంబుగఁ బాఱునదులఁ
గలసి, స్వస్థాన మేఁగితిఁ గాంక్షదీఱ ;
దేనికై మూఁగు నీఁగల తెండెమటులఁ
బిల్లలెల్లరు ననుగూడి ప్రియమునిడిరి ; 92

ఉ. కాంతునుపేక్షచేసయిన కష్టము బిడ్డలముద్దుముచ్చటం
గొంత శమింపఁజేయుచటుకొన్ని దినంబులుపుచ్చనొక్కనాఁ
డెంతో మనోహరాకృతి వహించిసరోజహితుండు రాగ నా
స్వాంతమికేమిసెప్ప రెపలాడెనుబూర్వమువిస్మృతంబుగాన్

ఉ. ఎట్టులొ తెచ్చికొన్న బిగియింపొకయింతయు సళ్లనీక లో
నట్టిటు వీఁగుచిత్తము రవంతయిన న్వెలిదోఁపనీక యీ
సుట్టిపడన్ మొగంబుపయి నుల్లముసూపిన, జంకిగొంకి నా
తట్టుకువచ్చి యేమన కతర్కితరీతిగఁ గౌఁగిలించినన్; 94

ఉ. ఏమిది యన్నయంత తడవేమియు లేదుపగూహనంబునన్
గోమటి బాష్పరూపనయి కూడన యేఁగి నభోంతరంబునన్
శ్యామలకోమలాంబుదమునై చరియించుచునున్నదాన,నిం
కేమన నేమిలాభము కవీశ్వర! యాయెను బోయె నింతకున్

తే. గీ. ఇంతకైనను సద్గుణవంతుఁ డగుచుఁ
గాఁపురం బగుడు సేయక గడపకున్న,
నింక నీమోసముల నెవ్వరెఱిఁగివత్తు
రంత ఖూలికి విషమాను కాంతమెవతె? 96

చ. అని వచియించుచుండు నెడ నల్లనఁ జల్లనిగాలి వీవ నా
వనదలతాంగియు న్మసుఁగుపయ్యెద వేసవరించికొంచు న
గ్గని కవిశేఖరా! నిను నకాండమువీడి చనంగఁ జిత్తమె
ప్పనియటులుండియుం జనుటవశ్యకమాటకుఁ జింతగల్గెడిన్

తే. గీ. నవురువెన్నల కమ్మదనాన నూరి
యవని యెల్ల నానందమయంబు గాఁగఁ,
బండి యొరగిన మొలగొల్కు పైరుచేల
కడకు రమ్ము పరిస్పర్శణము గలుగ; 98

చ. అను చలవాక నేఁగు జలదాంగనఁ జూపులకందు మేరకుం
గనిగని, బాష్పపూరములు కన్నులఁ గారుచునుండచిత్త మో
హన శిశిరాంశుబింబము వియత్తలమందు రహించియున్
దెసల్గనఁబడవౌర! యాత్మవికలత్వముకన్నులఁగప్పిపుచ్చుటన్

చ. ఒలసెడు పిల్ల తెమ్మెరల యూర్పుల నీకలు మేన రేఁగగం
బులుగులు గూళులన్ని దురవ్రాపుచు, నెండినయాకుజొంప
ముల్ గలగలలాడ మేలుకనికమ్మగనార్చెదునల్కుడొక్కఁ
డే చెలఁగెడిలోఁడుగాగృహముఁ జేరిశయించితి వేగుజామునన్;

తే. గీ. చల్ల వెన్నెల, వలిమల, జలదకాంత
మంచుతుప్పలు, సెలయేళ్లు, లంచబారు
లిందుశేఖరుతాండవ మేమొ యేమొ
కలనుగాంచుచు నిదుర మేల్కాంటి నపుడె! 101

సంపూర్ణము.

# దువ్వూరు రామిరెడ్డిగారి

## గ్రంథములు.



### నలజారమ్మయగ్ని ప్రవేశము.

ఈపద్యకావ్యము ఒకరెడ్డి పతివ్రత పవిత్రచరిత్రము. ధర్మ సూక్ష్మమునకై, మోమోటములేక యల్లుని కొఱత వేయింపఁ బూను పెంచెలరెడ్డి ధర్మైకపరతయు, నీతిభంగమున కన్నఁ బ్రాణము గోల్పోవుటయే శ్రేయమని పతికిబోధించి, తాను బాలెంతయయ్యు సహగమన మొనరించిన నలజారమ్మ పాతివ్రత్యమును, నలజారమ్మ తలిదండ్రుల మితిలేనివంతయు, సందర్భోచితముగ, మృదుమధురశైలిని రసార్ద్రముగ నీకావ్యమున వర్ణింపఁబడినవి. వెల. 0—4—0

---

### కృషీవలుఁడు.

ఇదియొక యపూర్వమగు చక్కని పద్యకావ్యము. ఈగ్రంథమును గుఱించి, ఆంధ్రప్రకాశిక విమర్శించుచు, వ్రాసినయభిప్రాయము నరయుడు; "కవితా ప్రపంచమున నూతన ప్రబోధము సంజనించినది. క్రొత్తక్రొత్త కావ్యరాజములు వెలువడుచున్నవి. గానగర్భితమగు గీతానినాద మెల్లయెడలఁ వినఁబడుచున్నది......పూర్వపరిస్థితులకును నేఁటి పరిస్థితులకును జాల యంతరముగలదు. ముందు సాధారణముగ రాజులే కవులకు నాశ్రయులై యుండిరి,........నేఁటి కాలమున ముద్రణాయంత్రములు వెలువడియుండుటవలనను, గ్రంథములు

సర్వజన సామాన్యమునకు సులభముగ లభ్యమగుటవలనను, ప్రజలరుచియుఁ గవుల యార్శకములు క్రమముగ మాఱినవి. ఇదివఱకు రాజప్రాసాదములయందును, ఉద్యానవనముల యందును సంచరించుచుండిన కవితాకుమారి, నేఁడు సామాన్య కర్షక కుటీరాంగణంబులను, వారి పంటపొలములందును, విహ రింపవలసివచ్చెను.

ఆంధ్రభాషయందుఁ గృషీవలుఁడు అను గ్రంథమువంటి స్వతంత్రకావ్యములు చాల కొద్దిగనున్నవి. ఆంగ్లేయకవులలోఁ గొందఱు కర్షకునిజీవితము పవిత్రమనియు, గౌరవనీయ మనియు, వర్ణించియున్నారు. అరవభాషయందు కృషీవలుని జీవితము కంబర్ అనుకవిచేతను, తిరువళ్ళువర్ నాయనార్ అను మహాకవిచేతను, పాడఁబడినది. కాని ఆంధ్రభాషాకావ్య ముల హాలికుని పూతచారిత్రమునకు చోటుగాసరాదు. శ్రీయుత దువ్వూరు రామరెడ్డిగారు ఆలోపముచుదీర్చ సమ కట్టిరి.

ఈకావ్యమందు సామాన్యకర్షకుని జీవితములోని మనో హరచిత్రములు లిఖింపఁబడినవి. అందుఁ గాఁపు దంపతుల సంబోధించుచుఁ గవి భావ గంభీరములును, రసవంతములును అగు పద్యముల నుడివియున్నాఁడు.

ఈకవి శైలి లలితపద బంధురమై రసకలితమై గాన గర్భితమై వీనులకు విందొనరించుచుండును. పద్యములు భావ గంభీరములై వ్యర్థపదరహితములై ప్రౌఢములై మృదువులై దనరారుచుండును. వెల. 0—4—0

